## —✱ విజ్ఞాపనము. ✱—

---

ప్రస్తుతము నాచే రచియింపఁబడిన

1. శ్రీవేంకటేశ్వర పొడుపుకథల పాత్రము.
2. ఈశశతకము.
3. లోకచరితము.
4. నానాసంభాషణము.

ముద్రణంబునకై పుణ్యాత్ములకొఱకు నెదురుచూచుచున్నవి.—అట్టి భక్తవరులు తమకోరికను దెలుపఁబరచిన నా గ్రంథంబుల వినిపించి యానందించువాఁడను.

బోడ్డుపైనాగులు
తణుకు
16—3—20



ఇట్లు
ముద్దు సర్వేశ్వరార్యుఁడు
మహోపాధ్యాయుఁడు

ఓం

శ్రీలక్ష్మీనారాయణాయనమః

# శ్రీహరివిఘ్నేశ్వరరామచంద్రశతకకదంబము.

ఇది

శ్రీలక్ష్మీనారాయణచరణారవిందధ్యాన[illegible]ణుండును,"
కాశ్యపసగోత్రోద్భవుండును దుడ్డు
చంద్రునకును కామయసుబ్బమాంబికా
చతుర్థపుత్రుండును, నగు సర్వే
శ్వరకవిచే విరచితంబయి

శ్రీ గంగాభాగీరథీ సమానురాలగు మునికుల
గోత్ర కోడూరి సుబ్బమాంబికా
విత్తసహాయంబుచే ప్రకటింపంబడియె.



రాజమండ్రి శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలలో
ముద్రింపఁబడియె.

1920

వెల ౦—౧—౦

# భగవద్ధ్యానము

ఉ. ఏవిభుఁ డీజగంబులను నెక్కువ ప్్రజ్ఞను జేసి వాటిలో
జీవులఁ బెంపగానుబడ[illegible] చిత్రపు జిత్రపుభోజ్యమిచ్చి వా
నేకవిధమ్ముగా నొలయ నేర్పడఁ జేయుచు సృష్టి జేయునో
యావిభు నస్మదీయగురు నాహరి నే స్మరియించి మ్రొక్కెదన్.

## భగవత్కృప.

ఉ. సర్వమయుండు మానవుల స్వాంతములోపల బై జగంబులో
నిర్వచనీయుఁడై వెలసి నిక్కపుభక్తుల చేయు కార్యముల్
సర్వము నిర్వహిల్ల దన సాయము జేసెడు మంచిచెడ్డ న
[illegible]ర్వ్యాలపోలె జూపెడును గూర్మి శుభాశుభ సూచనాళిచేన్.

తే. జ్ఞానిసూచన లెంచు నజ్ఞానివాని
లెక్కజేయక పొందెడు బెక్కు చిక్కు
లపుడు దేవుడదృశ్యుఁడై యటనె యుండి
తగు మతిని నొసఁగి భక్తవత్సలుడనబడు.

ఇట్లు

సిద్ధార్థినామసం॥ర ఫాల్గుణ
బ॥ ౧౧ మంగళవారము
తెనాలి

శ్రీలక్ష్మీనారాయణ ప్రేరితుండును
నిమిత్తమాత్రుండును నగు
దుడ్డు సర్వేశ్వరకవి.

ఓం

# ప్రస్తావము

తే. ధరణిరాజోలుతాలూక మెఱయుచుండి
చెలగు వెలిచేరు గ్రామాన వెలయు వైశ్య
కులజగోమారి సూరయగృహిణియు
నైనసుబ్బాంబను సుశీల ననఘచరిత.

తే. ఆయురారోగ్యవృద్ధులనందగాను
వేదవిహితంబుగాను దీవించియామె
పుణ్యశీలము హరిభక్తిమోదముతోడ
నించుకను నేర్చినట్టు వచింతునిపుడు.

శంఖ్యమునికులగోత్రయాచుదన పూర్వపుబుణ్యముచేతజ్ఞానియై
పసిపడి పుణ్యగాథలను భక్తులచేజదివించునాదరం
బునవినుబాత్రిగ్గనుచు మోదముతోడదనార్ధికోటిని
వినినిడితుష్టిజేసెదును వేలకువేలనుఖర్చుజేయుచున్

సీ. వేణుగోపాలుకో వెలలోనధ్వజమెత్తి
వాహనంబులమర్చి స్వామికిబ్రీతి
సంవత్సరంబున జరపించుకల్యాణ
మునకిచ్చిచాలగభూతటమును.

పులిదండిలోనదా బుణ్యంబునార్జించె
తనుకుసిద్ధేశ్వరు ధ్వజముకూడ
బాగుచేయించెను పవమానసుతురూప
విగ్రహంబును జేయు విత్తమిచ్చె
ఆ. పయిడిపర్విందు భద్రాద్రివాసుఁ డౌ
రాము నామకోటివ్రాయజేసి
వెడలనుండెనటకువీక్షింపవానిని
సుప్రసిద్ధచరితసుబ్బమాంబ.

తే. హరిహరులనిర్వురందునునమితభక్తి
కలుగునీమెకుమనుమఁడౌగమిడివంశ
జుండువిఘ్నేశ్వరుండునుసొబగుమీఱు
అన్నపూర్ణమ్మయనుమన్మరాలుగలరు.

ఆ. కాళ్లకూరికొలవుగన్నెమైవెలసి సీ
తమ్మనాఖ్యచేతదనరునాపె
కూడనీమెపౌత్రి కామరాజువీరలు
పుత్రపౌత్రవృద్ధి బొందెదరుగ.

ఆ. విష్ణుగూర్చిమఱియు వెనకయ్యగూర్చియు
రాముగూర్చి నేను వ్రాసినట్టి
స్తోత్రములను భక్తి సుబ్బమాంబవినుచు
నచ్చునొందఁజేసె నర్థమిచ్చి.

కం. పండితసత్కారంబే
యుండెనుగాయంచుఁ జెప్పనుక్తి వినుచుదా
మెండుగ రూప్యంబులఁగొని
నిండించెను నాదు చేయి నిశ్చలభక్తిన్.

తే. వేదులాన్వయసంభవు విప్రవర్య
సూర్యనారాయణాహ్వయు కార్యఘటన
సాయమొనరించినట్టి యాశతావధాని
సాటియొజ్జనుదలఁచుదు సంతసమున.

ఇట్లు

తణుకు
16—3—20

శ్రీహరిదాసుడు
దుడ్డు సర్వేశ్వరకవి.

ఓం !

శ్రీలక్ష్మీనారాయణాయ నమః.

(నానాసంభాషణములోనుంచి)

## శ్రీహరిస్తోత్రము.

క. శ్రీహరి నీవే దైవము
శ్రీహరి నిలువుము మదీయచిత్తమునందున్
శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నన్నుంచు నీదుచిత్తమునందున్.

క. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నను మఱవకుమయ నీతో నుస్సున్
శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నిను మఱవనట్టి చిత్తంబిడుమా.

క. శ్రీహరి నను మఱవకుమయ
శ్రీహరి శ్రీహరి యనంత శ్రీగుణధామా
శ్రీహరి నీనామామృత
మే హరియని గ్రోల జెప్పుమీ నామదితో.

క. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి శ్రీహరి సమస్త శ్రీకళ్యాణా

శ్రీహరి ననుగావుమయా
శ్రీహరి బ్రహ్మాదివంద్య శ్రీహరిదేవా.
౪. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నీలోరమించు శ్రీభక్తవిభో
శ్రీహరి హరనుతవిభవా
శ్రీహరి ననుబ్రోవనెంచు చిత్తములోన
౫. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి ముల్లోకనాథ శ్రీమానాధా
శ్రీహరి సన్నేలుమయా
శ్రీహరి బ్రహ్మాదిదేవ చిత్తవిహారా.
౬. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి హరబ్రహ్మముఖ్యచిత్తవిహారా
శ్రీహరి నారదవంద్యా
శ్రీహరి శ్రీహరియనంగ చిత్తంబిడుమా.
౭. నాలో నీవిటుతప్పులు
మేలే హరియెంచనాదు మెయిబాధబడెన్
ఏలోపమింక నెంచక
చాలగదయయుంచి బ్రోవు నదయాండవగుచున్

క. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరియని నీదుసేవ జేయుచునీకున్
జోహారు లిచ్చుచుంటిని
సాహాయము జేసి బ్రోవు సదయుఁడవగుచున్

క. నవతను లిరుప్రక్కలంగన్
నివసింపగవక్షమందు నిలచినసిరితో
పవన విహారమునల్పెడు
నవనీశ్వరనల్లనయ్య నారాధింపుమినన్.

శ్రీలక్ష్మీనారాయణార్పణమస్తు.

ఓం !

శ్రీవిఘ్నేశ్వరస్తోత్రము.

క. శ్రీపార్వతీశప్రియసుత
నీపాదాబ్జములఁ గొలుచు నెఱభక్తులలో
నేపాటివానిపనులను
లోపంబులఁ జేయవనెడు లోకఖ్యాతిన్

క. వినినీప్రాపునుగోరుచు
ననిశము నిన్నుఁగొలుచు మమ్ము హర్షముతోడన్

గనుచుండి వనులఁగూర్చుచు
ననవరతము బో్రివమాకు నభయంబిమ్మా.

క. ఉప్పాడ కొత్తపల్లెను
నొప్పారగ వెలసిమమ్ము నూరకవిడువక
దప్పేమి మేము చేసితి
మెప్పగిదిని మెప్పగంచుమిఁక విఘ్నేశా.

క. పనిచెఱుపులదొరవౌద వు
మనమున సత్కార్యములను కాపు సేయక
బనులను దలఁచెదునరానకు
బనిగూర్చెదు గాఁడవీవుభక్తులకుశలక.

క. ఎవరికిఁ జెప్పఁగనగుగా
భువిలో నీమహిమకల్మి భూరిబలాఢ్యా
శివకేశవులే కొల్తుగా
నవినయముగ నిన్ను బనుల నల్పెదు వేళక.

సీ. తలయంటుకొనునాఁడు, తల్లిపార్వతినిన్ను
దల్పుదగ్గఱనుంచి తనయుపరుఁడు
గడపదాఁటకయుండ, గనుచుండుము ననీవు

ఖడ్గంబుఁ జేఁబూని కరళకంఠు
నడుగైననిడనీక, కడుమగంటిమిఁజూపి
కరవాలమునఁదిప్పి పఱగుచుండఁ
బసివాఁడవౌనిన్నుఁ బరమేశుఁడింతైనఁ
బరిభవింపఁగ లేఁడు పౌరుషమున

తే. గీ. ఒప్పియుండెను నాఁడు నీగొప్ప తెలిసి
అట్టినీదగు ఘనతను నెవ్వరైన
బ్రహ్మ చెప్పఁగలండొకో పరమపురుష
లోల విఘ్నేశ మమ్ముఁ బ్రోవుము లోటు లేక.

సీ. తుండంబుద్రిప్పుచు, దోఁదుజంబులనంది
మదిసలరెడు వేళ మఱువకయ్య
మూషకమెక్కుచుఁ బూనికఁ బోవుచు
మదిసలరెడు వేళ మఱువకయ్య
వీటిలో నీకిడు విందారగించుము
మదిసలరెడు వేళ మఱువకయ్య
పితలదగ్గరనుండి బ్రీతితో సలుపుము
మదిసలరెడు వేళ మఱువకయ్య

తే. గీ. ఈడువారలుగూడుచు నాడుచుండి
మదిని నలరెడువేళను మఱువకుండ
భక్తవరులగు మాదగుపనులనెల్ల
విఘ్నములు లేక చేయవే విఘ్నరాజ.

౪. ఎలమిని నీప్రార్థనమును
సలలితముగ జేయు దుడ్డుసర్వేశ్వరున
న్నలరెడు వేడ్క భక్తుల
గలుములచేఁ బ్రోవుగాత కరిరాడ్వదనా

కీర్తన

(స్మరహర శివశంకర భోవలె)

పల్లవి॥ వెనకయమము బ్రోవుమయు, విఘ్నరాజదేవ॥ వెన॥
మా మొఱాలకింపుమిక మదిని గరుణబూను॥ వెన॥

1. పాండుసుతులభండనమున । బాగుగగాచినటుల॥ వెన॥
2. దమయింతికి దిరుగనాథు। దయచేసినటుల ॥వెన॥
3, దుడ్డుసర్వేశ్వరుఁబ్రోచు। దొడ్డమేటిదేవ ॥వెన॥

శ్రీలక్ష్మీనారాయణార్పణమస్తు.

ఓం.

## రామచంద్రస్తోత్రము.

ఉత్పలమాలికావృత్తము.

లంకకు సార్వభౌముఁడగు। రావణుఁ గెల్చి తదీయసోదరున్।
జంకక రాజు జేయుచును। జానకితో బంగరంబుతోడని।
శ్శంకనయోధ్యకుం జనఁగ, సంతసమొందుచు రాజుఁ జేయని।
న్బంకజపీఠమందునిజ ! భార్యను జేర్పఁగ జెట్టబట్టనీ॥
యంకమునందు నీచెలిసు। భాసనమైవసియుంప నెచ్చెలి।
జ్జంకను జేర్చి పట్టగభు। జంబులమీఁదను "నీదె భారమౌ।
పంకజనేత్ర రామ" యన భామకరంబును వేసి భాసిలన్।
బొంకము మీర జంచలను జూనినవల్లె మేఘమాయనన్।
శంకను గల్గజేయు మెయి। చందపుటందము ముద్దులొల్కఁగా॥
గొంకక సోదరద్వయము। గూర్చుచు వీవన వేయుచుండనీ
వంకకు నెండ రాకుఁకి। బట్టగము త్రైపుభత్రి మొందునీ।
కింకరుఁడంజనీసుతుఁడు। కేలుఁ మోడ్చి నుతించుచుండగా।
శంతెల మాన్యవర్గమును। శేషలు కోర్వగమానుతెల్లనీ।

కింకరుఁడీవనంబులిడ । నెంతటిదైవభవమొందియుంటివో।
శంకరబ్రహ్మముఖ్యసుర। సంఘముఁ గ్గాఁ రాఁ చాటునీ।
కింకరుఁడో ఘనేనుఁడవ। గీర్తివిశాలశ్రీలోకనాయకా॥

ఉ. శ్రీపతి నీమహామహిమ । చిత్తమునన్ దలపోసి చూడగా
నీపయివారలేగనట । నిక్కము నమ్మితినాదు పాపసం
తాపమడంచి నీకృపను । దాపునుజేయుచు నీపదాబ్జమే।
తేపకుఁ బూజకై యొసఁగి తేల్పుము నన్ను భవాబ్ధిలోపలన్.

తే. దుష్టులను శిక్షజేయుగ దొడ్డవారి
రక్షణంబును జేయఁగ రాముఁడగుచు,
బుట్టితివిగా వయానాఁడు భూమిగాన
నేఁడు శ్రీరామనవమియాఁడు ముందుఁ.

కం. ఏనాడు బుట్టి పెఱిగితొ
యీనాటికినైన నిన్ను నెవ్వరు మఱవన్
గానము కారణమే నున
భూనాథా నివు విష్ణుమూర్తి వికాదే.

కం. నీసేవయె భూజనములు
చేసెడు కార్యంబటంచు జెప్పెదరదిగా

కే సామాన్యునకైనను
నీ సాన్నిధ్యంబు జేరనిదియేతోచున్.

కం. కావున నిను గొలువంగను
నీవడుపున జేరియుంట యీకార్యములో
నావంతలోటు జేయక
నీవే కాపంగవలయు నిక్కము రామా.

ఇది

శ్రీ లక్ష్మీనారాయణ చరణారవింద ధ్యాన
పరాయణుండును కాశ్యపగోత్రోద్భ
వుండును దుష్టవంశాబ్ధిచంద్రుండును
కామయ సుబ్బమాంబికా చతుర్థ
పుత్రుండును నగు సర్వేశ్వర
కవి విరచితంబు.

సర్వము సంపూర్ణము
శ్రీలక్ష్మీనారాయణార్పణమస్తు

సంపూర్ణము.

